వ. కావున నెంతటిబలవంతు నైనను బుద్ధిబలంబునంజేసి బుద్ధిమంతుండు గెలుచు ననఁ
గరటకుం డట్లుకాక నీకుఁ గార్యసిద్ధి యయ్యెడు మరుగు మనిన దమనకుండు పింగళకు
సమ్ముఖంబునకుం బోయి నమస్కరించి యిట్లనియె. దేవరకు నే నత్యంతాపరా
ధంబు చేసితి సంజీవకునిఁ గొలువం బెట్టి తగనిపనిఁ జేసితిఁ గావున నీయపరాధంబు
సహింపవలయు నని యిట్లనియె. 266

క. పదవిం బొందినసచివుఁడు, పదఁపడి నృపునెదుట నెట్లుపలికిన నమరున్
బదహీనుఁడు తగుపలుకులు, పదివే లాడినను భూమిపతి కింపగునే. 267

క. అనినం బింగళకుం డా, తనితో నీ వేమిచెప్పఁదలఁచిన నీకం
టెను హితుఁడు గలఁడె నాయొ, ద్దను వెఱవక చెప్పు మనిన దమనకుఁ డనియెన్.

క. ఈసంజీవకుఁ డెప్పుడు, నాసన్నిధిఁ దప్పనాడి నగుచుండు నినున్
దా సరకుసేయఁ డేమిటి, నీసున నినుఁ గొలువఁ జేరనీఁ డెవ్వానిన్. 269

చ. అదియునుగా కతండు భవదాజ్ఞఁ జరింపక నీప్రభుత్వసం
పదయును మంత్రశక్తియును బ్రాభవశౌర్యమహోద్యమంబులున్
మదమునఁ దప్పనాడును గ్రమంబున నీమహిఁ దాన కైకొనన్
మదిఁ దలపోయు నేఁ దెలిసి మానుగ నీ కెఱింగింప వచ్చితిన్. 270

గీ. అనిన భయవిస్మయమ్ములు మనముఁ గలఁప, నేమియును బల్కకున్న మృగేంద్రుతోడ
నధిప నీమంత్రి నీకంటె నధికుఁ డైన, కతన నభివృద్ధి నీ కెట్లు గలుగు వినుము. 271

గీ. మహిమ నత్యుచ్ఛ్రయుం డగుమంత్రిమీఁదఁ, బార్థివునిమీఁద నొక్కొక్కపదము నిలిపి
నిల్పి స్త్రీస్వభావంబున నిల్వలేక, యుదధికన్యక వారిలో నొకని విడుచు. 272

వ. అన నతండు వెండియు నిట్లనియె. 273

సీ. మనుజవరుఁడు నిజామాత్యుఁగా నొక్కని, నిల్పఁ దద్భారంబు నిర్వహించి
తనరు స్వచ్ఛందవనితాదిసుఖముల, మోహ మంతంతకు మురియఁబడఁగ
మోహంబుచే గర్వమునఁ గన్ను గానక, గర్వాతిశయమునఁ గానిపనులఁ
జేసి నిజేశ్వరుచే నొత్తు ననుబుద్ధి, నతని నుల్లంఘింప మతిఁ దలంచుఁ

గీ. దలఁచి దృఢతరముగ నేలి దళముఁ గూర్చుఁ, గూర్చి రాజ్యంబు తనకుఁ గైకొనఁగఁ గడంగుఁ
గడఁగి నృపపక్షమగువారి కడుపు కిడక, కుశలబుద్ధిని బతిఁ గాలవశునిఁ జేయు. 274

వ. అని మఱియును. 275

ఉ. పెంచి యనేకసంపదలఁ బ్రీతి వహింపఁగఁ జేసి తన్ను మ
న్నించినరాజుమీఁదఁ దుది నేరము పెట్టి పరావనీశదే

శాంచితభూరిసంపదల కాసపడున్ పడి హానిఁ బొందునే
మంచితనంబు దుష్టు లగుమంత్రులకుం గలదే తలంపఁగన్. 276

గీ. అతిసమర్థుఁడై మంత్రి కార్యములు దీర్చు, నపుడు హితమతి గాకున్న నదియుఁగాదు
మిగుల ననురక్తుఁ డగువానిమీఁదఁ గరుణ, నవనిపతి యున్నకుండిన నదియుఁ గాదు.

వ. అని వెండియు. 278

క. సేవకులు లోకమందును, శ్రీవిశ్రుతు లైన నేల సేవింతురు ధా
త్రీవిభులఁ దమకు జరగమి, కై వలసినపంపు సేయ నగుఁ గాక మహిన్. 279

వ. అనినం బింగళకుండు సంజీవకుండు నా కత్యంతస్నేహితుం డెట్లు విడువనేర్తు నని యిట్లనియె. 280

గీ. సకలదుష్టదోషసహితదేహం బిది, నాకు నేటి కనెడినరుఁడు గలఁడె
యట్లు నిజహితుండు నప్రియం బొకచోటఁ, గడఁగి చేసె నేని విడువరాదు. 281

వ. అని పలికి సంజీవకు నుద్దేశించి. 282

ఉ. నమ్మిక యిచ్చి చేకొని ఘనమ్ముగఁ బూజ్యునిఁ జేసి మాటమా
త్రమ్మున వీఁడు గాఁ డని వృథా బహుదోషము లెన్ని భృత్యు రా
రమ్మని యాజ్ఞ సేయ నగరా నను లోకమువారు వానినే
రమ్మన వాఁడె పోవుఁ దెగ రాదు కలంపకు నాదుచిత్తమున్. 283

వ. అనిన విని దమనకుం డిట్లనియె. 284

ఉ. ఎంతయు గారవించి తను నింతయమాత్యునిఁ జేసి రాజ్య మి
ట్లింతయుఁ జేతి కిచ్చి యనయమ్మును దేవర నమ్మి యున్నచో
గొంతయినం దలంపక నిగూఢముగా మహి యెల్లఁ గైకొనన్
జింత యొనర్చె నే నెఱిఁగి శీఘ్రము నీ కెఱిఁగింప వచ్చితిన్. 285

వ. మఱియును. 286

గీ. అన్నదమ్ముఁ డైన నాత్మజుం డైనను, సచివపదవిఁ బనులు జరపుచోట
వానిమీఁదిదృష్టి వదలినయప్పు డా, రాజుఁ బాయు నిందిరావధూటి. 287

చ. సుజనహితోక్తి కర్ణముల సోఁకఁగనీయ కహర్నిశంబునుం
గుజనులబుద్ధి చిత్తమునఁ గూర్చి సరాష్ట్రము గాఁగ నమ్మహీ
భుజుఁడు నశించు రోగి తనబుద్ధి నపథ్యమె పథ్య మంచు న
క్కజముగ నాత్మలోఁ దలఁచి కాలవశంబును బొందుచాడ్పునన్. 288

ఉ. అప్పటి కప్రియం బయి నిజాత్మకు మీఁదటికిన్ బ్రియంబు గాఁ
జెప్పెడువాక్యముల్ విను సుచిత్తుఁడు నిచ్చక ముజ్జగించి మేల్

తప్పక చెప్పు నుత్తముఁడు ధారుణిఁ బుట్టరు పుట్టిరేని న
య్యొప్పెడివారల న్విడువ కుండు రమాసతి యెల్లకాలమున్. 289

క. ప్రాఁత యగుమంత్రి తనకుం జేఁతఱికముఁ జేసె ననుచు శిక్షించి యొరుల్
లాఁతిం బెట్టిన నీఁతలు, ప్రోఁతలు నై రాజు విడుచుఁ బొందక మూఁకల్. 290

సీ. పాటించి తనప్రాఁతపరివారమును బ్రోచి, హత్తిననృపునకు హాని గలదె
మొన పేర్చి వైరులు మోహరించినవేళఁ, గేడింప కప్పుడె గెలుచు టొండె
మొనసి దైవాధీనమున నపజయ మైన, భూపాలుఁ గప్పి కొంపోవు టొండె
నర్థంబు దఱిఁగిన నధిపతి ధన మిచ్చి, నడపలే కుండిన నవయు టొండె
గీ. నెవ్విధంబున నైన మహీశువలని, మన్ననకుఁ జాల నిలుతురు మఱవ కెపుడు
విడువ కుండుదు రెటువంటి వేళలందుఁ, బూర్వపరివారమును బోల్పఁ బురుఁడు గలడె.

క. అనినం బింగళకుం డి, ట్లను సంజీవకున కభయ మట్లొసఁగి పద
స్థునిఁ జేసి ప్రీతి యొనరిం, చిన నా కై గ్గతఁడు లోనఁ జింతించునొకో. 292

వ. అనిన దమనకుం డిట్లనియె. 293

గీ. ఎంతసఖ్యంబు జేసిన నెంతప్రియము, చేసి తిరిగిన దుర్జనుచిత్త మేల
చక్కఁటికి వచ్చు శునకపుచ్ఛంబు కడఁగి, వంక యొత్తినఁ జాయకు వచ్చునెట్లు.

క. కొఱ యగుపదార్థ మెందుం, గొఱ యగుఁ గొఱ గాని దైనఁ గొఱ గా దెచటన్
నెఱి నమృతధారఁ బెంచినఁ, గొఱ యగునే ముసిఁడి కల్పకుజముంబోలెన్, 295

ఉ. వారక యుత్తముండు దనవారి కపాయము వచ్చువేళ ము
న్నారసి చెప్పి తీర్చును దురాత్ముఁ డెఱింగియుఁ జెప్ప కాత్మ ని
ష్కారణవైర మూఁది తనగాదిలిచుట్టము నైన నిర్దయా
కారత నొంచుఁ గొండియముఁ గైకొను నొండులచేటుకు న్నగున్. 296

వ. అని వెండియు నిట్లనియె. 297

సీ. వ్యసనదూరుం డైనవాఁడె పో సిద్ధుండు, గీర్తితం బగునదె వర్తనంబు
పురుషానుకూలతఁ బొగ డొందునదె భార్య, బుధవర్ణనీయుండె బుద్ధియుతుఁడు
మదముఁ జేయక యుండునదె మంచిసంపద, యాశావిహీనుండె యధికసుఖుఁడు
కపటస్వభావనిర్గతుఁడె సన్మిత్రుండు, విజితేంద్రియుండె వివేకఘనుఁడు
గీ. కారణము లేకయును బరకార్యములకు, నోపి తీర్చినయాతండె యుత్తముండు
సమరరంగంబునం దధీశ్వరునిపనికి, వెనుకతీయనియాతండె వీరభటుఁడు. 298

వ. అని పలికి దమనకుండు సంజీవకునిమీఁదఁ బింగళకునిచిత్తంబు తిరుగంబడకుండుట
యెఱింగి యిట్లనియె. 299

సీ. అధికకామాసక్తుఁ డైనభూపాలుండు, మొనసి కార్యాకార్యముల నెఱుంగ
కత్యంతమదఘనాహంకారయుక్తుఁడై, సన్మార్గ మరుచిగా సంచరించుఁ
దొడరి భృత్యామాత్యదోషవిచారంబు, చాలక శిక్షింప శక్తి లేక
యపవాదకంటకాయతశోకగహనంబు సొచ్చి, వెల్వడు నట్టిచోటు గాన
గీ. కహితమృగములచే నొండె నాత్మభృత్య, దావపావకపటుశిఖాతతుల నొండె
రీతిఁ జెడుఁ గాని మఱి సేకరింపలేఁడు, శౌర్యగుణధామ మృగకులసార్వభౌమ. 300

వ. అని చెప్పినఁ బింగళకుం డిట్లనియె సంజీవకుండు నాకుఁ బ్రతికూలుం డై కీడు సేయ సమర్థుం డగునే యనిన దేవర కవ్విధంబున మున్న విన్నవింపవలసిన వాఁడనై యుండియు మంత్రభిన్నం బైనఁ గార్యంబు దప్పు దని శంకించితి మంత్రం బతిప్రయత్న రక్షణీయంబు గావలయు విజ్ఞాతశీలాచరణుం డగుశాత్రవు విశ్వసించి మయిమఱచిన నతం డేమిసేయ నోపండు విజ్ఞాతశీలాచరణం బగుడిండికంబుచేతం గాదె మందవిసర్పిణి మృతిం బొందె ననుటయు బింగళకుండు తత్కథాక్రమం బెట్లనుటయు నతం డిట్లనియె. 301

క. మందవిసర్పిణి యన నా, నందముతోఁ జీరపేను నరపతిశయ్యం
బొందుకొని పెద్దకాలం, బెందుం బోకచట నుండు నిష్ట మెలర్పన్. 302

క. అచ్చోటికి నొకతెఱఁగునఁ, గ్రచ్చఱ నరుదెంచి డిండికం బను నామం
బచ్చుపడిననల్లి మదిం, బొచ్చెము లే కనియె యూకపుంగవుతోడన్. 303

శా. నీపాదంబుల కేను మ్రొక్కెదఁ దగ న్నీవాఁడ నీచుట్టముం
గాపాడం దగు నన్న యూక మకటా కైవార మింతేటికిన్
నాపుణ్యంబున వచ్చి తిచ్చటికి ధన్యం బయ్యె మద్వంశ మీ
భూపశ్రేష్ఠునిపాన్పునందు సుఖినై పూజ్యుండ నైతిం జుమీ. 304

వ. అని మఱియును. 305

క. న న్నేమియడుగుకొఱకై, సన్నుతగుణ ప్రియము చెప్పఁ జనుదెంచితి నా
యున్నయది హీనవృత్తము, కన్నారఁగఁ జూచి యేమికాంక్షింతు వనా. 306

వ. అనిన నమ్మాటకు డిండికాఖ్యం బగుమత్కుణం బిట్లనియె. 307

సీ. కలిమిలేములు చూచి కాంక్షించునా యర్థి, తనకు నక్కఱ యైనఁ దగులుఁ గాక
యితఁడు లోభి వదాన్యుఁ డితఁ డని యెఱుఁగునా, యర్థంబు కాంక్షఁ బెల్లఱచుఁ గాక
హీనాధికంబుల నెఱిఁగి యాచించునా, లేమికై యొరులఁ గారించుఁ గాక
విద్య లే దని తన్ను వివరింప నేర్చునా, సభల విత్తాపేక్షఁ జదువుఁ గాక
గీ. తెల్ల బట్టలవారి వెంట నెల్లఁ దిరిగి, తనదు నేర్పున నడుగంగ దాత మెచ్చి
యర్థ మిచ్చిన నలరు లోభానుకూల, చిత్తుఁ డీకున్న నంతటఁ జిన్నవోవు. 308

వ. అని పలికి డిండికుండు వెండియు నిట్లనియె. 309

గీ. అర్థతారతమ్య మడుగంగఁ జెప్పితి, నర్థకాంక్ష నిన్ను నడుగ రాను
మిత్ర నాకు నశనమాత్ర మింతియ నీవు, చేయవలయునట్టిసాయ మెల్ల. 310

ఉ. మానక మున్ను నేఁ జెనఁటిమానవరక్తముఁ ద్రావుచుండుదుం
గాని మహీశుదేహమునఁ గల్గినశోణిత మానఁ గానమిన్
మే నెరియంగ నుండి నిను నేఁడు గనుంగొన నిందు వచ్చితిన్
దీనికి నీయకొ మ్మిటు మదీయమనఃప్రమదంబు చెల్లఁగన్. 311

వ. ఇవ్విధంబున నువ్విళ్ళూరినకారణం బెట్లంటేని. 312

సీ. శాల్యన్నఘృతసూపశాకభక్ష్యములతోఁ, వాసన గలరసావళులతోడ
బహుఫలంబులు గలపానకంబులతోడఁ, గమనీయమాంసఖండములతోడ
మధురేక్షుగోక్షీరమధుపానములతోడ, సరసంబులైనపచ్చళ్ళతోడ
సుమనోజ్ఞదధితక్రశుద్ధజలములతోఁ, బరిమళగంధపుష్పములతోడఁ

గీ. జతురశృంగారవతులైనసతులతోడ, ననుదినంబును భోగించునవనిపతుల
దేహరక్తంబుఁ గ్రోలంగ నూహ చేసి, తిరుగుచుండుదుఁ గాని సిద్ధింప దెందు. 313

వ. అనుడిండికంబుపలుకు లాకర్ణించి కటకటంబడి మందవిసర్పిణి యిట్లనియె. 314

చ. చలనము లేక యీనృపతిశయ్య నహర్నిశమున్ సుఖించు నా
మెలఁకువ హానిచేయుటకు మేకొని రాఁదగునయ్య దోషకా
రులు సుజనాపకారములు రోయుట నైజము గాన నీకు నే
నలుగుదుఁ గాని యించుకయు నాత్మ నెడంబడ మత్కుణోత్తమా. 315

వ. అనిన మందవిసర్పిణికి డిండికుం డిట్లనియె. 316

క. నీదగు నెలవున నాకుం, గా దవు నన బలిమి లేదు కరుణాన్విత నీ
పాదముల కేను మ్రొక్కెద, వా దడవక సమ్మతింపవలె నన నదియున్. 317

వ. దాక్షిణ్యంబుకతంబున నొడంబడి యిట్లనియె. 318

క. వెర పెఱిఁగి వేగిరింపక, సురతశ్రమపారవశ్యసుఖసుప్తి మెయిన్
బొరసినధరణీకాంతుని, వరదేహం బొయ్యఁ గఱచి వలయుఁ దొలంగన్. 319

క. కక్కురితకాఁడు కార్యము, చక్కటి యెఱుఁగండు సంధ్యాజామున నతనిన్
బొక్కిపడ నీవు కోఁటల, నొక్కిన నది తెలియ మన కనువు దప్పుఁ జుమీ. 320

గీ. అనిన నట్ల కాక యని నల్లియును జీర, పేను నేకశయ్యఁ బ్రీతి నుండఁ
బేనుకన్ను మొఱఁగి ప్రియపడి భూమీశుఁ, గదిసి సందెజాము కఱచె నల్లి. 321

వ. అప్పు డమ్మహీపతి నిద్రావిరహితుండై యుండుటం జేసి యదరిపడి తనపదతలంబు
లొత్తుచున్న యనుచరుల నాలోకించి యిట్లనియె. 322

ఉ. దీవియఁ దెచ్చి చూడుఁడు మదీయశరీరము తేలు కుట్టిన
ట్లే వెత పొందెడుం గడు గయంబున రం డన వాండ్రు వచ్చి నా
లో వివరాంతరంబునకు లోఁగినమత్కుణనాథుఁ గాన కా
భూవరుపాన్పుమధ్యమును బొందినమందవిసర్పిణిం దగన్. 323

క. పొడగాంచి యిదియె కఱచెం, బుడమిధవుని దేహ మనుచుఁ బొడవడఁగింపన్
మడిసెను మందవిసర్పిణి, కడు దుర్జనుపొందు హాని గా కేలుండున్. 324

వ. అని యిట్లు దమనకుండు చెప్పిన విని పింగళకుండు నాపరాక్రమం బెఱింగియు
సంజీవకుఁ డెయ్యెసాధనంబుల నన్ను సాధించువాఁ డనుటయు నతం డిట్లనియె.

ఉ. కొమ్ముల గ్రుచ్చి యెత్తియును ఘోరఖురాగ్రనిపాతనంబులన్
జిమ్మియు దంతఘాతములఁ జించియు వాలవిశాలచాలనో
గ్రమ్ముల నెమ్మె లెల్లఁ గడికండలుగాఁ జదియంగ మోఁదియున్
సమ్మద మారఁ జంచు మృగసత్తమ యేమఱి యుండితేనియున్. 326

వ. అనిన విని పింగళకుం డొక్కింత చిత్తక్షోభంబుగా దమనకుం జూచి నీ వింతట నరిగి
యావృషభనాయకునియభిప్రాయం బెఱింగి శీఘ్రంబ రమ్మన్న వాఁడును నంతంత
నొదుఁగుచుఁ జకితుండునుంబోలె సంజీవకుం జేరం బోయిన నతం డిది యేమి భయ
కంపితుండ వగుచుఁ జనుదెంచితివి కుశలంబ కదా యనిన సేవకధర్మంబునం దిరుగు
వారికి సంసారసుఖంబు గలదే విను మని యిట్లనియె. 327

ఉ. ఇంతటివానిఁ జేసె నృపుఁ డింతధనం బొడఁగూడెఁ బత్కువ
త్యంతము నాపయిం గల దయత్నసుఖానుభవంబు దీర్ఘకా
లాంతరసంచితం బని నిజాత్మఁ దలంచును బాలిశుండు ప్రా
ణాంతముగాఁ దలంచి చలితాత్మత నుండు వివేకి యిమ్మహిన్. 328

వ. అని చెప్పి మఱియును. 329

సీ. ధనవంతు గర్వంబు దార్కొన కేలుండు, వ్యసని కాపద యేల పొసఁగకుండు
సతులఁ జూచిన మతి చలియింప కేలుండు, నృపులమన్నన లేల నిజము లగును
గాలంబుచే రూపుకడచన కేలుండు, గౌరవ మర్థి కేకరణిఁ గలుగు
దుర్జనవాగురఁ దొడర కెవ్వఁడు నిల్చుఁ జిరకాలసుఖము నేనరుఁడు పొందుఁ
గీ. గాని గుణములు విడిచి పుణ్యానుకూల, వర్తనంబుల నిహపరవైభవములఁ
బొందువాఁ డొక్కఁ డొక్కఁడు పుణ్యపురుషుఁ, డతఁడు దేవాంశజనితమహాత్ముఁ డండ్రు.

గీ. దేశకాలధనాగమస్థితులఁ దెలిసి, యరులు మిత్త్రులుఁ దన కెవ్వ రని యెఱింగి
యెవ్వఁ డైనను నాశక్తి యిట్టి దనుచు, నధిపుఁ డెప్పుడుఁ జింత చేయంగవలయు.

వ. అనిన విని సంజీవకుం డచ్చటి రాజకార్యప్రసంగం బెద్ది యనినఁ గదియం జని కూర్చుం
డి యల్లన నిట్లనియె. 331

క. ఏకాలంబున రాజులఁ, జేకొని సేవకులు నమ్మ చెడు టది సిద్ధం
బీకోలఁది నే నెఱింగితి, నీకుం జెప్పంగఁ దగు ననింద్యచరిత్రా. 332

వ. అనుచు నేకాంతంబున నిట్లనియె. 333

ఉ. ఎప్పుడు మోసపోవక మృగేంద్రునిపైఁ దగువేగు వెట్టి తెం
పొప్పఁగ నాయతం బయిన నోపిక ముట్టినకార్య మైనచోఁ
దప్పక నిర్వహించుకొని ధాత్రికి నీవ యధీశ్వరుండ వై
చొప్పడకున్న మాబ్రతుకు సూవె వృథా వృషభాధిపోత్తమా. 334

వ. అనిన సంజీవకుం డదరిపడి మృగేంద్రుని కరుణాకటాక్షంబు నాయెడ శిథిలంబుగా
దు గదా యనిన నతం డేకాంతంబుగా నిట్లనియె. 335

క. విపరీతచిత్తవృత్తునిఁ, గపటి దయారహితుఁ జపలు గాంభీర్యగుణ
వ్యపగతు రా జని కొల్చిన, నపగాధము లేకయైన నాపద వచ్చున్. 336

వ. అని మఱియును. 337

చ. కొలువున కీవు రాఁ దడవ ఘోరకరాళవిశాలదంష్ట్రలన్
మెలఁగఁగ నిన్నుఁ బట్టి బలిమిన్ గళరక్తము మున్ను గ్రోలి క
ట్టలుక నిజాశ్రితప్రతతి కంతటికిన్ భవదీయమాంస మ
గ్గలముగఁ బంచిపెట్టుటకుఁగా నియమించె మృగేంద్రుఁ డుగ్రతన్. 338

వ. ఇత్తెఱంగు నేఁడ కాదు పెద్దకాలంబునుండియుఁ బింగళకుండు నీనామంబు ప్రసంగ
వశంబునం గొలువులోపల వినంబడినయప్పు డసహ్యతయుఁ బ్రజ మెచ్చు
నీపారవశ్యంబును మెచ్చమియును నీవార లైనవారలయెడ నాగ్రహంబును నీవు
వెలిగానిసంపద కసూయయు నీయొప్పమికిఁ బ్రియం బందుచిత్తంబును నై యున్న
వాఁడు మున్ను నీకు శపథం బిచ్చి కొలిపించుటం జేసి యివ్విధంబునం దెలుపం
జనుదెంచితి నీకుఁ బొం దైన తెఱంగు జూచుకొ మ్మనిన సంజీవకుం డత్యంత
దుఃఖాకులుం డగుచు నిశ్చేష్టితుం డై యూరకుండి కొండొకసేపునకు దమనకుం
జూచి యిట్లనియె. 339

ఉ. పూని దురాత్మగమ్య యగుపాల్తుక చక్కఁదనంబుఁ బాత్రస
న్మాన మెఱుంగలేనినరనాథువివేకముఁ గష్టవృత్తిమై

వానినలోభిసంపద మహాంబుధిలోపలఁ బర్వతంబులం
దూనినవర్షధారలును యోగ్యము గావు నిరర్థకంబు లౌ. 340

క. ఆరాధ్యమానుఁ డగునృపు, నారాధన దనకు లేమి యది గల దంచున్
గోరి యపూర్వప్రతిమా, కారము గైకొనుట వైరకారణ మరయన్. 341

క. నేరమున కలుగు భూపతి, చేరువనె ప్రసాద మొందు సేవకులపయిన్
నేరము లేకయె యలిగెడు, భూరమణునిమనసు ప్రీతిఁ బొందునె యెపుడేన్. 342

వ. అని పలికి వెండియు. 343

సీ. రాత్రులు సరసిలో రాజహంసము చొచ్చి, నవసితోత్పలఖండనంబు సేయు
తఱిఁ బ్రతిబింబితతారౌఘములఁ జూచి, యవియ కైరవపఙ్క్తి యని తలంచి
ముక్కునఁ బొడుచుచు నక్కడ వృథ యైనఁ, దక్కినపుష్పసంతతియుఁ గల్ల
గాఁ జూచు వేగినఁ గన్నులఁ గనియును, బొడువ శంకించుచుఁ గుడుపు దక్కి
గీ. నిలుచుఁ గల్ల నిజంబును నిజము కల్ల, యు నని స్వాత్మకుఁ దోఁచు నెక్కొక్కవేళ
దాను మూఢాత్మతను మున్ను తప్పఁ దలఁచి, సాఁడ నని చూడఁ డెన్నండు నరుఁడు మదిని.

క. నెపము గలకోపమైనను, నృపుచేఁ బడవచ్చుఁ గాక నెప మేమియు లే
కపరాధంబులు వెదకెడు, కపటాత్మునిఁ గొలువ వశమె కలకాలంబున్. 345

వ. అని పలికి సంజీవకుండు దమనకున కిట్లనియెఁ బింగళకుండు పరప్రణీతవ్యాపారసంగ
తుండు గాఁబోలు నని మఱియు నిట్లనియె. 346

గీ. వైద్యవిద్వజ్జనామాత్యవర్యు లేధ, రాధిపున కిచ్చ లాడుదు రావిభుండు
సంతతారోగ్యధర్మతోషముల వృద్ధిఁ, బొంద నేరక శీఘ్రంబ పొలిసి పోవు. 347

వ. అని పలికి సంజీవకుండు మఱియు నే నీరాజునకుఁ గీడు దలంచుట లేదు నాయెడ
నిర్నిమిత్తాపకారి యయ్యెఁ జూచితే యని యిట్లనియె. 348

శా. భావాతీతము లైనకార్యములు దీర్పన్ మెచ్చఁ డెల్లప్పుడున్
సేవాభక్తివిహీనదుర్మతుల రక్షించు న్మహీభర్త దా
నేవాఁ డైనను రాజులం గొలుచు నే ర్పెభంగులం గల్గు హా
సేవాధర్మము యోగి కైన వశమే చింతింప నీధాత్రిలోన్. 349

క. గుణులం జేరినపురుషుఁడు, గుణి యగు నవగుణులఁ గూడి గుణహీనుఁ డగున్
బ్రణుతికి నెక్కిననదులు ల, వణజలధిం గూడి చెడినవడువున నెందున్. 350

గీ. మంచిగుణములు గలయట్టిమనుజునందు, స్వల్పగుణ మైన నది ప్రకాశంబు నొందు
శ్వేతగిరిశిఖరంబుపై శీతకరుని, కిరణజాలంబు మెఱవడిఁ బొరయుకరణి. 351

గీ. కానిగుణములు కలయట్టివానియందు, మంచిగుణములు పైకొని మించలేవు
సురుచిరోరునిశాకరకిరణజాల, మంజనాద్రిపైఁ బ్రసరించి యడఁగినట్లు. 352

వ. అని మఱియును. 353

చ. ఖలునకుఁ జేసినట్టియుపకారము విశ్రుతశబ్దజాలదు
ర్బలున కుపన్యసించినసుభాషితవర్గము మూఁగవానితోఁ
బలికినవాక్యపద్ధతులు భావమునం దనమాటపాటిగాఁ
దలపనివానికిన్ బహువిధంబుల బుద్ధులుఁ గానిపద్ధతుల్. 354

సీ. దారుణాటవిరుదితంబుఁ జేసినయట్లు, చేరి శవంబుఁ గైచేసినట్లు
నిర్జలం బైనచో నీరజం బిడినట్లు,వట్టిచోటను విత్తు వెట్టినట్లు
సారమేయముతోఁకఁ జక్కఁ గట్టినయట్లు,చెవిటి కేకాంతంబు చెప్పినట్లు
తనరఁ జీకునకు నద్దంబుఁ జూపినయట్లు,వెలిమిడిలోఁ నెయ్యి వేల్చినట్లు
గీ. చాల నవివేకి యైనట్టిజనవరేణ్యుఁ, దగిలి కొలుచుట నిష్ఫలత్వంబు సేయు
సేవకుల కెల్లభంగి విశేషబుద్ధి, నిల వివేకంబు గలరాజుఁ గొలువవలయు. [సనంబు

గీ. మొనసి యల్లంతఁ గని ధూర్త మ్రొక్కు లేచు,నార్ద్రహృదయుఁ డై యొసఁగు నర్ధా
బిగియఁ గౌఁగిటఁ గదియించుఁ బ్రియము వలుకు,విషము నమృతంబులోనను వెలిని గాన.

మ. రవి యస్తాద్రికి నేఁగునప్పుడు విచారం బేది మత్తాళి లో
భవ శేచ్ఛన్ వెసఁ బంకజోదరము దర్పం బేర్పడం జొచ్చి త
ద్వివరం బంతటఁ గ్రమ్మకొన్నఁ గడు నార్తిం బొందుచందాన మా
నవులుం గొందఱు మీఁ దెఱుంగ కెలమిన్ వర్తింతు రీలాగునన్. 357

వ. అని చెప్పి మఱియును. 358

చ. శరనిధి దాఁటు నావయును సంతమసం బడఁగింప దీపమున్
వరకరిశిక్ష కంకుశము వాయువుఁ గూర్పఁగఁ దాళవృంతమున్
వెరవునఁ జేసె బ్రహ్మ పదివేలవిధంబుల మూర్ఖచిత్తువి
స్ఫురణ మడంప లేక తలపోయుచు నిప్పుడు నున్నవాఁ డహో. 359

వ. అని పలికిన సంజీవకుం డిట్లనియెఁ దృణాహారవ్యవహారంబునఁ బతిహితకార్యంబు చేయునాకుఁ గాలముఖప్రవేశంబు కర్తవ్యం బయ్యె నింక నెక్కడిబ్రతుకు వినుమని యిట్లనియె. 360

గీ. ఎన్న నిప్పుడు పెద్దలు పిన్న లనక, వితతమాయోపజీవితయుతులు గాన
సాధులకుఁ గీడు దలఁతురు జగతి నుష్ట్రి, మునకుఁ గాకాదు లేకమై మొనసినట్లు. 361

వ. అనిన విని దమనకుం డక్కథ నాకెఱింగింపు మన్న సంజీవకుం డిట్లనియె. 362

చ. అతులమహోగ్రకాననమునందు మదోత్కటనామసింహ ము
ద్ధతిఁ జరియించు దానికిఁ బ్రధానులు కాకము పుండరీకమున్
మతిగలజంబుకంబును గ్రమంబునఁ బం పొనరింపుచుండి యొ
క్కతఱి నరణ్యదేశమునఁ గాంచిరి యుష్ట్రము నిందు వేడుకన్. 363

మ. కని నీ వెచ్చటనుండి వచ్చి తనినం గాకాదిజంతుత్రయం
బునకున్ వందన మాచరించి యనియెన్ మున్ సార్థవాహుండు వీఁ
పున మోపింపఁగ మోసి డస్సి యెచటం బోలేక దాఁగున్న వాఁ
డను మీ రేగతి నన్నుఁ బ్రోచినను వేడ్కన్నిల్తు మీచేరికన్. 364

వ. అని పలికినయుష్ట్రంబునకు జంబుకం బిట్లనియె. 365

క. ఈకాన నొకమృగేంద్రుఁడు, చేకొని సామ్రాజ్యపదవిఁ జెన్ను వహించున్
మా కతఁడు కులస్వామిగఁ, గైకొని సేవింతు మెల్లకాలము కడఁకన్. 366

క. నీవును మాలో నొకఁడవు, గావున మృగరాజసమ్ముఖంబున నిడి నే
నీవిధముఁ దెలియఁ బలికి శుభావహ మగుభంగి నీకు ననుసంధింతున్. 367

చ. వెఱవక విశ్వసింపు మము వింతగఁ జూడక వచ్చితేని ని
న్నెఱుకపడన్ మృగేంద్రునకు నింపుగఁ జెప్పి తదీయభక్తికిన్
గుఱుతుగ నిన్నుఁ జేసి మనకోరిక లెల్ల నతండు దీర్పఁగా
నెఱసినవేడ్క నల్వురము నెమ్మది నుండుద మెల్లకాలమున్. 368

క. అనుటయు నాలొట్టియయును, దనమది ముద మంది వెంటఁ దగిలిన వానిం
గొని చని మృగపతిముందట, వినయముతో నతని తెఱఁగు వినిపించుటయున్. 369

వ. ఆమృగేంద్రుండును నయ్యుష్ట్రంబు నభయవాక్యంబులఁ బ్రమోదం బెసంగం జేసి కథనకనామధేయం బిడి నాపూర్వామాత్యులలో నీ వొకండ వై యుండు మని నియమించిన గోమాయుపుండరీకకాకంబులం గలిసి యతిస్నేహంబునఁ బెద్దకాలం బున్న సమయంబున నొక్కనాఁడు మదోత్కటుండు కాకవ్యాఘ్రగోమాయూష్ట్రంబులం గనుంగొని యిట్లనియె. 370

ఉ. కల్యమునందు భక్ష్యమును గానక మేను కృశించె రోగదౌ
ర్బల్యము నాకుఁ గల్గుటను భద్రగజేంద్ర శిరఃపలాదబా
హుల్యము లేమి నుద్ధతికి నోపక చిక్కితిఁ గాన దేహమై
కల్యము మానుకైవడి సుఖం బగుపథ్యముఁ దెచ్చి పెట్టుఁడీ. 371

వ. అని పలికిన మృగేంద్రునకు నన్నలువురు నేకవాక్యంబుగా నిట్లనిరి. 372

గీ. మీకుఁ దగినయాహారంబు మేము దెచ్చి, ప్రీతి నొకపూఁట కైనను బెట్టలేము
చాల నల్పుల మగుట మాచంద మట్టి, దనిన మృగరాజు వారితో ననియె నపుడు.

క. ఏపాటియశన మబ్బిన, నాపాటిం బ్రొద్దు గడపి యట్లుండెద నా
కీపాపపుఁదెవు లాదవెం, జూపోపక దైవ మిట్లు సాం పడఁగించెన్. 374

వ. అట్లు గావున. 375

క. వడిఁ బోయి మీర లిప్పటి, కడిదికి నేమాంస మైన గ్రక్కునఁ గొనిరం
డెడ సేయ కనుచుఁ బనిచినఁ, గడు వడి నలువురును బోయి గహనములోనన్.

గీ. పొదలు సొచ్చి చూచి పుట్టలు వీక్షించి, చెట్టు గుట్ట మొదలు చేరి కాంచి
గిరులు నదులుఁ దొనలు బరికించి పరికించి, కాన నొకమృగంబుఁ గానలేక. 377

వ. కాకవ్యాఘ్రగోమాయూష్ట్రంబులు నలుదిక్కులం జెదరి వెదకం బోయి కథన
కుండు వెలిగా నెక్కడ్చో మువ్వురుఁ గూడుకొన్న సమయంబునఁ గాకం బిట్లనియె.

గీ. స్వామిపని పూని వచ్చినచందమునకు, నడవిలోపల నేమియు నబ్బదయ్యెఁ
గంటకాహారుఁ డైనయీ కథనకాఖ్యు, నతని కాహారముగఁ జేయ ననువు గాదె.

వ. తచ్ఛేషంబును మనకుఁ గొన్ని దినంబు లుదరపోషణంబునకుఁ జాలు గతకాలంబున ననే
కమృగమాంసంబుల మనలఁ బోషించినరాజున కీసంకటంబుఁ బాపం దగదే యనినఁ
గాకంబునకు నవి యిట్లనియె. 380

గీ. అభయ మిచ్చి కరుణ నంచెఱకం టెను, విభవ మిచ్చినట్టి విభుని మొరఁగి
మనము వీనిఁ జంప మది నెంచిగినయేని, నాగ్రహించి మనల నాజ్ఞ చేయు. 381

క. పేరెఱుకమాత్ర నధిపతి, చేరువ నంతంతఁ దిరుగుచిఱుతని నైనం
గారించెనేని సచివుని, భూరమణుఁడు గినియు వీనిఁ బొసఁగున చంపన్,

వ. కావున మనస్వామి యెఱుంగక యుండ నతనిఁ జంపుట కార్యంబు గా దనినఁ
బుండరీకజంబుకంబులకుఁ గాకం బిట్లనియె. 383

గీ. చావు తథ్యంబు మనకు విచార మేల, వెక్కుదివసంబు లాఁకటి వెల్లువడుచు
హరికి నెచ్చోట నేమియు దొరకదయ్యె, నరయ నింతకు దైవికం బట్ల కాదె.

చ. మది నధికక్షుధార్తుఁ డగుమానవుఁ డాలిని బిడ్డ నొల్లఁ డిం
పు దనర సర్పముం దనకుఁ బుట్టినయండములన్ భుజించు నొ
ప్పు దఱిగినట్టిచోటను బుభుక్షితుఁ డై దురితంబు చేయఁగా
మదిఁ దలపోయ కుండునె ప్రమాదము పుట్టుఁ దొలంగి పోదమా. 385

వ. అనినఁ గాకంబునకు శార్దూలం బిట్లనియె మనస్వామి మహావ్యాధిపీడితుండును
బుభుక్షితుండును నై యున్న యెడఁ దొలంగిపోవుట భృత్యన్యాయంబు గా దతని

సమ్ముఖంబునకుం బోవుద మని కదలునంతం గథనకుండుం గూడుకొన్న నన్నలువురుం జని సింహంబుబహిర్ద్వారంబునఁ గథనకుని నిలిపి మువ్వురుం జని మదోత్కటునకుం బ్రణమిల్లి యిట్లనిరి. 386

గీ. అధిప గిరిగహ్వరముల కుఁ గాటవులకు, నరిగి యామిష మబ్బక తిరిగి తిరిగి
చిక్కితిమి నీవు చిక్కి నశింప నేల, విన్నవించెద మే మొకవెరవు వినుము. 387

గీ. కథనకుండు మిమ్ముఁ గార్యార్థియై వచ్చి, కొలిచినాఁడు గాని నిలువలేదు
వాఁడు నీకు మాకు వలయుభోజన మగుఁ, బ్రియము వదలి మట్టుపెట్టితేని. 388

వ. అని కాకంబు పలికిన విని మృగేంద్రుండు కర్ణస్పర్శపూర్వకంబుగా హరిస్మరణంబు సేయుచు నభయవాక్యంబు లొసంగి కొలిపించుకొని యిట్లు సేయం దగునే విను మని యిట్లనియె. 389

మ. ధనదానంబును నన్నదానమును గోదానంబు భూదానముల్
విను మిట్లీయభయప్రదానమునకు న్నిక్కంబు తుల్యంబు లా
ననరా దీయెడ నశ్వమేధమఖపుణ్యంబుల్ భయభ్రాంతుఁ గా
చినపుణ్యంబునఁ బోల దంచు సుజనుల్ చెప్పంగ వింటిం దగన్. 390

వ. అనినఁ గాకం బిట్లనియె. 391

గీ. కులముకొఱకు విడుచుఁ గొఱగానిపుత్త్రునిఁ, గులము విడుచు నూరు నిలుపుకొఱకు
భూమికొఱకు విడుచు బోరన గ్రామంబు, ధాత్రి విడుచు నృపుఁడు తనకుఁగాను.

వ. కావున మే మందఱముం గలిగియుఁ బ్రయోజనంబు లేదు సకలజంతురక్షకుండ వగు నీశరీరంబు నిలిచినం జాలు నాదేహం బీపూఁట కాహారంబు సేయ నవధరింపు మని వాయసంబు పలికిన విని మృగపతి యూరకున్నయెడ లబ్ధావకాశులై తక్కిన మువ్వురుం గూడుకొని యతనిముందట నిలిచి యుండ వాయసంబు మఱియు నిట్లనియె.

గీ. తప్పఁ జూచి నన్ను మెప్పింపఁజాలవు, చాలకున్న నేన చత్తు నాశ
రీరమాంస మిపుడు ప్రియమున భక్షింపు, మనఘ నాకు దీన నగు ముదంబు. 394

వ. అనినం గాకంబునకు సింహం బిట్లనియె. 395

గీ. అల్పమాంస మిందు నాప్యాయనము గాదు, వట్టిహింస నాకుఁ గట్ట నేల
యనిన నాలకించి యమ్మృగేంద్రునితోడ, జంబుకంబు పలికె సామ్యఫణితి. 396

క. నాదేహము నీ కిచ్చితిఁ, గా దనక భుజింపు స్వామికార్యము సేయం
బ్రోది గలనాకు నిదె నీ, పాదంబులె దిక్కు నూవె పరమార్థముగన్. 397

వ. అనిన విని మదోత్కటుండు కాకంబుతోడఁ బల్కినట్ల యమ్మృగధూర్తంబునకుం బ్రత్యుత్తరం బిచ్చినఁ బులి కదియం జనుదెంచి సాష్టాంగనమస్కారంబు చేసి వినయ

పూర్వకంబుగా నిట్లనియె. 398

క. ఎవ్వరు నేటికి నామెయిఁ, గ్రొవ్వినమాంసంబు గలదు గొను మాఁకలియున్
నొవ్వియును దీఱు నంతట, నవ్వల నారోగ్య మగు మృగాధిప నీకున్. 399

వ. అని శార్దూలంబు పలికిన మృగేంద్రుం డిట్లనియె. 400

ఉ. గోవుల విప్రులం దఱిమి కూడఁగ ముట్టి భుజించి తచ్ఛరీ
రావృతమాంసపోషణమునం దనిశంబును మేను పెంచుటన్
గా విటువంటికల్మషవికారపుమేనులు భక్ష్యభోజ్యముల్
నీవు దొలంగు మాఁకటికి నేఁడును నోర్చెద వ్యాఘ్రపుంగవా. 401

వ. అని మదోత్కటుండు పలికినఁ బుండరీకంబు సలజ్జావనతవదనఖిన్నత్వంబునం దొలఁగి చనినఁ దదనంతరంబ కథనకుం డతనిం గదియం జని మచ్ఛరీరంబున భవదాత్మరక్షణంబు గావింపం దగునన్న నాతుణంబ. 402

క. వడి నుఱికి లొట్టిపిట్టను, మెడఁ గోఱలఁ గఱచి పట్టి మేదినిమీఁదం
బడఁ దిగిచిన శార్దూలము, నొడఁగూడినక్క తాను నుదరము వ్రచ్చెన్. 403

వ. వ్రచ్చి తచ్ఛరీరమాంసంబు మృగపతికిం బెట్టి తచ్ఛేషంబు గోమాయువ్యాఘ్రకాకంబు లనుభవించెఁ గావునఁ గ్రొత్తగాఁ గొలిచినసేవకుం డెంతబలవంతుం డయ్యును రాజునకును బరివారంబునకును హత్తనేరఁ డత్తెఱంగున నన్నుం జూచి తెలియం బలికి వెండియు సంజీవకుం డిట్లనియె. 404

క. సన్నపువారల నధిపతి, మన్నించినఁ బ్రాపుఁ డైనమంత్రికి బ్రతు కే
మున్నది మునుము న్నతఁడును, సన్నకసన్న నటఁ బాసి చనకున్నఁ జెడున్. 405

వ. అని మఱియును. 406

సీ. చెలఁగి మానససరసీతటంబున నొక, గ్రద్ధ హంసములలోఁ గలసి యుండ
నదియును నొకవన్నెహంసంబు గాఁబోలు, ననుచుఁ జూచినవార లాత్మఁ దలఁతు
రొక్కటి కలహంస యూరిచేరువఁ బ్రేత, భూమి గృధ్రంబులఁ బొందుపడినఁ
గనుఁగొని గృధ్రింబుగాఁ దలంతురు గాని, రాయంచ యనువిచారంబు రాదు

గీ. గానఁ దగువార లున్నభూకాంతునొద్ద, నల్పు లైనను గుణవంతు లై భజింతు
రధిపునొద్దను హీనాత్ము లలమికొనిన, భవ్యగుణుఁ డైననధిపతి ప్రకృతిఁ దొలఁగు.

వ. అని సంజీవకుండు రాజునకు నాకును నన్యోన్యభేదం బెవ్వఁడో పుట్టించె దురాత్ముం డైనవాఁడు నిజంబు కల్లయుఁ గల్ల నిజంబుఁగా మహీశ్వరునకుఁ జెప్ప నెవ్వరి నేమి సేయఁ డతనిదయావిశేషంబు నామీఁద శిథిలంబయ్యెఁ గార్యంబునుం దప్పె నేమి సేయుదు నని మఱియు నిట్లనియె. 408

గీ. ఖడ్గమును రాజతేజంబు వసుధమీఁద, నతిభయంకర మగు నందు నశనిపాత
మొక్కఁడిన కాని నొప్పింప దుర్విరిపుల, రాజతేజంబు చెఱుచు సరాష్ట్రముగను.

వ. కావున నే నతనితోడిసంగ్రామంబున మృతిం బొందుటయ భావ్యంబు గాని తదా
జ్ఞానువర్తన మయుక్తంబు. 410

క. ఉడుగక కార్యాకార్యము, లెడఁదం బరికింపఁ జెలుఁగ కేపను లైనన్
బెడఁ జేసెనేని వానిం, దడయక గురు నైన విడువఁ దగు నేభంగిన్. 411

వ. అనికి నిశ్చయించి మఱియు నిట్లనియె. 412

చ. క్రతునివహంబుఁ జేసినను గైకొని దానము లెన్నియేనియున్
జతురతఁ జేసినన్ బ్రచురసాగరతీర్థము లాడినన్ రణ
క్షితి నిమిషంబు నిల్చి దృఢచిత్తమునం బ్రతివీరమర్దన
వ్రతమునఁ బ్రాణముల్ విడుచువానిఫలంబునఁ బోలఁ డేమియున్. 413

వ. అదియునుంగాక. 414

ఉ. ధీనిధి యై మనస్థిరతఁ దెంపున వైరి నెదిర్చి యాజిలోఁ
దా నిలుగంగ స్వర్గమునుఁ దద్రిపువర్గము నుక్కడంచినన్
వానిసమస్తసంపదలు వచ్చుటయుం గడు రెండు నొప్పుటం
బూనిన శత్రుభంజనముఁ బోలునె యొండొకరాజధర్మముల్. 415

వ. కావున నా కిప్పుడు యుద్ధంబ కార్యంబు నానిశ్చయంబు వినుము. 416

గీ. పన్ని రణమున నిలువక పాఱిపోయి
ప్రాణములు దాఁప నెప్పుడేన్ బడకపోఁడు
ప్రాణసంశయ మైనచోఁ బ్రాజ్ఞుఁ డెదిరి
గెలుచు నొండైన మృతి నొందుఁ దొలఁగిపోఁడు. 417

వ. అనిన విని దమనకుం డిట్లను రణమరణంబు మంచి దని యసాధ్యశత్రుమధ్యంబునం
దఱియ నఱుకం జను నే శత్రుపరాక్రమం బెఱుంగక వైరపడు నెవ్వాఁడు వాఁడు ప
రాభవంబు నొందు మున్నొక్కటిట్టిభంబుచేత రేపంబడినసముద్రుండును బోలె ననిన
నక్కథఁ దెలియఁ జెప్పు మనిన సంజీవకునకు దమనకుం డిట్లనియె. 418

ఉ. టిట్టిభదంపతుల్ సుఖపటిష్ఠత వార్ధితరంగజాలసం
ఘట్టితభూమిజాతములకందువగూఁట వసించి యున్నచో
నట్టి యెడం గులాంగన నిజాత్మవిభుం గనుఁగొంచు నన్ను నీ
పట్టునఁ గావరా ప్రసవభారమునం దురపిల్ల వల్లభా. 419

వ. అనిన దానివిభుం డిట్లనియె. 420

గీ. గర్భభార మెఱుంగుదుఁ గంబుకంఠి, చేయవలసినకార్యంబుఁ జెప్పు మనినఁ
గలదు సకలంబు నేమియు వలదు నాకుఁ, జిత్తసంక్షోభ మొదవెడుఁ జిత్తగింపు.

ఉ. సంగతిఁ బర్వకాలములఁ జంద్రునిఁ జూచి చెలంగి పొంగుచున్
నింగియు దిక్కులుం గడచునీరధి యీమనమున్న తెంకికిం
జెంగటఁ బాసిపోవుట విశేషపుబుద్ధి ప్రసూతికాల మై
నం గదలంగలేము జతనం బగుచోటికిఁ బోయి నిల్తమే. 422

వ. అనినం బ్రియాంగనాలాపంబులు హాస్యంబు సేయుచు నాతీతు విట్లనియె. 423

గీ. ఈసముద్రుండు నాతోడ నెట్లు వైరపడ సమర్థుండు తెలియక పలికి తబల
సంశయము మాను మిట్టట్టు జరుగుపనికి, ననినమాటల కాకాంత యనియె నిట్లు.

వ. ఈసముద్రునకును నీకును హస్తిమశకాంతరంబు వినుము. 425

క. తనశక్తియుఁ బరశక్తియు, జననుత విజ్ఞానదృష్టిఁ జర్చించినయా
మనుజుఁడు దుఃఖప్రాప్తికి, ననుకూలుఁడు గాక సౌఖ్య మందుచు నుండున్. 426

వ. అని పలికి మఱియును. 427

క. ఎన్నఁ దగుహితులు బుద్ధులు, విన్నను వుసఁ జెప్ప నతఁడు వినకున్నఁ జెడున్
మున్నొకకాష్ఠమువలనం, బన్నుగఁ బడిచెడినకూర్మపతియునుబోలెన్. 428

వ. అని టిట్టిభాంగన పలికినఁ బురుషుం డాకథ యెఱింగింపు మనిన నది యిట్లనియె.

క. కంబుగ్రీవుం డనుపే, రం బరఁగినకచ్ఛపము నిరంతరసౌఖ్యా
డంబర మగునొకకొలనం, బంబినసంతోష మెసఁగఁ బాయక యుండున్. 430

గీ. అందు వికటసంకటాఖ్యహంసయుగంబు, నిలిచి కచ్ఛపంబుఁ గలసి తిరుగ
వానలేక చాల వఱపైనఁ గూర్మంబుఁ, గాంచి యప్పు డనియె సంచదోయి.

క. మానససరోవరాంతర, మానితజలపానకేళిమగ్నుల మైనం
గాని మనబడలికలు మఱి, మానంగా నేర విచటిమడుఁగులనీళ్ళన్. 432

గీ. నఱికి యెలతామరలతూండ్లు నముల లేవు, చాలఁ దీయనితెలినీరు గ్రోల లేదు
జాతిపక్షులతోఁ గూడ జరగ లేదు, పోదమా యన్నఁ గచ్ఛపంబును దలంకె. 433

వ. హంసయుగ్మంబున కిట్లనియె. 434

సీ. కూడితి మిన్నాళ్లుఁ దోడఁబుట్టువులట్లు, యెడరు పుట్టినచోట విడుతురయ్య
పక్షహీనుం డని భావింతు రేని న, పక్షుండ నతిదుర్విపక్షవృత్తిఁ
బక్షాధికులు మీరు పక్షపాతము గల్గి, పక్షిమార్గమున సంరక్షతోడఁ
గొనిపోవ కుండినఁ గొల నింకునంతలో, నెవ్వరిచే నైన నీల్గవలయుఁ

దోడుకొనిపోవుఁ డన నంచదోయి యొక్కకాష్ఠమధ్యంబుఁ గమఠంబుఁ గఱవఁ బనిచి
కడలు రెండును ముక్కునఁ గఱచిపట్టి, యెగసి రాయంచ లుడుపీథి నిగుడి పఱవ.

మ. అతిదూరంబునఁ గచ్ఛపంబుఁ గొనుచున్ హంసంబు లిట్లేఁగఁగా
క్షితిపై నొక్కపురంబుమానవులు తచ్చిత్రంబు నీక్షింపుచున్
జతురోక్తుల్ బెరయంగఁ జెప్పుకొన నాసంరావ మాలించి దు
ర్మతి యై యాత్మఁ దలంపలే కపుడు కూర్మం బంచలన్ జూచుచున్. 436

క. ఇది యేమికలకలం బని, వదనముకాష్ఠంబు వదలి వసుధం బడున
య్యద నెఱిఁగి మాంసలుబ్ధకు, లదయతఁ గొని రనుచుఁ డిట్టిభాంగన మఱియున్.

క. వినుమా వెండియు నొకకథ, వినిపించెద నీకుఁ బూర్వవృత్తము దెలియన్
విన నేర్చినమతిమంతుఁడు, వినుతిం బొందంగఁ గను వివేకులతోనన్. 438

వ. కావున మున్ననాగతవిధాతయుం బ్రత్యుత్పన్నమతియు యద్భవిష్యుండును నను మీనంబులు గల వందులోన యద్భవిష్యుం డల్పమతి యగుటంజేసి వెర వెఱుంగక చిక్కి మృతిం బొందినతెఱం గగు ననినఁ దత్కథాక్రమంబు దెలియం జెప్పు మని పురుషుం డడిగినఁ డిట్టిభాంగన యిట్లనియె నొక్కతటాకంబున నిప్పుడు చెప్పం బడినమీనత్రయంబును నన్యోన్యస్నేహంబునఁ బరిభ్రమించుచుండ నొక్కనాఁ డనాగతవిధాత యిట్లనియె. 439

క. మడుఁ గింకఁ జొచ్చె నీజల, మెడఁ జేరిన, బెద్దమడువు కేఁగుట భారం
బెడచేసిన జాలరులకు, నెడ గలుగును మనలఁ బట్ట నిదె పోవలయున్. 440

వ. అని మఱియు నొక్కవిశేషంబు వినంబడె నింతకమున్న జాలరులు దమలోనం బలికినపలుకులు లీసరోవరతీరంబునందు. 441

గీ. అడుసు చిక్క జలము లాడకాడకు నింకె, మొనసి పులుఁగుగములు దినఁగఁ జొచ్చె
సాధనంబు లెల్ల సమకూర్చుకొని మన, మరుగు దెంత మెల్లి యనఁగ వింటి. 442

వ. కావున నీప్రొద్దు యీసరోవరంబు విడిచి పోవం దగు ననినఁ బ్రత్యుత్పన్నమతి యిట్లనియె, 443

క. నేరుపు గలమతిమంతుఁడు, నేరమి యొకవేళఁ బొంద నెఱి నది గెలుచున్
జారద్వయసంపర్కము, గౌరవముగ మెలఁగుగోపకాంతయుఁబోలెన్. 444

వ. అనుటయు ననాగతవిధాతయు యద్భవిష్యుండును నక్కథ మాకుం జెప్పు మనినఁ బ్రత్యుత్పన్నమతి యిట్లనియె. 445

సీ. కరికుంభయుగ మతికాఠిన్య మగుఁ గాని, యీకాంతచనుదోయి కింత వెలితి
దళితారవిందంబు తెలివి మేలగుఁ గాని, యీయింతిమోముతో నీడు గాదు

మెఱసి నిల్చినకారుమెఱుఁగు మేలగుఁ గాని, యీకొమ్మతనుకాంతి కింత కొఱఁత
మించి కెంజిగురాకు మెఱయుచుండును గాని, యీలేమపదముల కీడు గాదు

గీ. అనుచుఁ గొనియాడుతలఁపుల కగ్గలించి, కమ్మవిల్తునిప్పుదుసాయక మ్మనంగఁ
జారశృంగారమోహనాకార యగుచుఁ, బ్రణుతి కెక్కెనగోపాలబాల యోర్తు.

గీ. కాంతుఁ గనుఁబ్రామి తా భోగకాంక్ష దండ
పాలకుఁడుఁ దత్సుతుఁడు నుపపతులు గాఁగ
నెన్నఁడును వారు దమలోన నెఱుఁగ కుండ
నొనర రతికేళి సలుపంగ నొక్కనాఁడు. 447

క. తలవరికొడుకును దరుణియుఁ, దళుకొత్తెడువేడ్క మన్మథక్రీడ మెయిన్
గెల నరయక జక్కవకవ, పొలుపున బహురతులఁ బ్రొద్దు పుచ్చుచునుండన్. 448

ఉ. ఆతఱి దండపాలకుఁడు నయ్యెడకుం జనుదేరఁ దత్తనూ
జాతుని గాదెలోన నిడి సమ్మద మొప్పఁ దలారితోడ సం
ప్రీతి రమించునంతట గభీరగతిం జనుదెంచుచున్నయిం
టాతనిఁ జూచి గోపిక భయంపడ కయ్యుపనాథుతోడుతన్. 449

వ. ప్రత్యుత్పన్నమతి గావున నిట్లను వీఁడె మద్వల్లభుం డరుదెంచెఁ బాదుకారావంబు వినంబడియె నీవు నామీఁద వృథారోపంబు దీపింపం దిట్టుచు మద్గృహంబు వెడలు మనిన వాఁడును నట్లు సేయ నంతటఁ గదిసి గోపాలుండును దనగృహంబు చొచ్చి భార్యతో నెన్నండు లేనిది యీ తలవరి మనయిల్లు చొచ్చి నిన్నుఁ దిట్టుచుం బోవుటకుఁ గతం బేమి యని యడిగిన నది యిట్లనియె. 450

గీ. కొడుకుమీఁద నతం డిటు కోప మెత్తి, యేనిమిత్తంబొ చంపక మాన ననుచు
నులసి వెదకంగ వీఁడు నా నిలయమునకు, ఖిన్నమతి రాఁ గుసూల నిక్షిప్తుఁ జేసి.

సీ. తమకింపకున్నచో దండపాలకుఁడును,దనయుని నిల్లిల్లు దప్పకుండఁ
జూచుచు మనయిల్లుఁ జొచ్చి మావాఁడు మీ, యింటనె యున్నవాఁ డిప్పు డనిన
నెన్నండు రానిమాయింటి కేటికి వచ్చు, నతఁడు రాఁ డని త్రోచి యాడఁ గినిసి
నిష్ఠురాలాపముల్ నీవును వినుచుండ, ననుఁ బల్కి పోవుచున్నాఁడు కంటె

గీ. యింత కోపించి పొడగన్న నెంత దెగునె, వీనిపై నంచు నీగాదెలోన డాచి
చూప కుండితి నిదె వీనిఁ జూడు మనుచుఁ, బొలఁతి తలవరిసూనుని బిలుచుటయును.

వ. పిలిచినఁ గుసూలంబు డిగ్గ నుఱికి నిలిచిన వానిం బరిరంభణంబుఁ జేసి నగుచున్నతన భార్యం జూచి మెచ్చి గోపాలకుం డిట్లనియె. 453

క. ఈపిన్నవాని నిప్పుడు, వేపడినం జంపు వాఁడు శీఘ్రము దోషా
రోపంబున కర్హుం డై, కోపము పాపంబుపొత్తు కువలయనేత్రా. 454

క. వీనిం దండ్రిని గూర్పక, మానుగ నను గూర్చి మిగుల మన్నించితి ప
ద్మానన నీసరి లే రని, తా నప్పుడు గొల్ల మెచ్చెఁ దనకులకాంతన్. 455

వ. కావున గోపాంగనయుఁ బ్రత్యుత్పన్నమతి యై తనముప్పు దప్పించుకొనియె నట్లు మనమును నప్పటికిం దగినకార్యం బనుసంధింత మని యూరకున్న యనంతరంబ యనాగతవిధాత యనుమత్స్యంబు వెడ తెగనిజలప్రవాహమార్గంబున నన్యజలాశయంబునకుం బోయె నమ్మఱునాఁడు. 456

గీ. మత్స్యఘాతుకు లేతెంచి మడువు సొచ్చి, మొదలఁ బట్టిన మీలను గుదులు గ్రుచ్చి
యీడ్చి తిరుగంగ నప్పుడు హెచ్చి గుదికి, నడుము గబళించి జీవంబు విడిచినట్లు.

క. అనువున నుండఁగ నొండొక, వనజాకరమునకు నేఁగి వారలు గుదులం
బెనురొంపి పోవఁ దొలఁచినఁ, జనెఁ బ్రత్యుత్పన్నమతి నిజం బగుకడఁకన్. 458

వ. అంత యద్భవిష్యం డెటుఁ బోదు నేమి సేయుదు నని విచారించుసమయంబునం బట్టువడి మృతిం బొందె నని చెప్పి టిట్టిభాంగన కొన్నిదివసంబులకుం బ్రసూతి యైనఁ దత్ప్రతిజ్ఞాభంగంబు సేయంగలవాఁడై సముద్రుం డయ్యండంబుల నపహరించిన.

క. ఆపక్షీంద్రకులాంగన, దీపించినశోకజలధిఁ దేలుచుఁ బతితో
నాపలుకులు విన వైతివి, పాపాత్మ సముద్రుచేతఁ బడఁ బాలైతిన్. 460

ఉ. అవ్వల నెన్ని లే వట మహాగహనైకనికుంజవృక్షముల్
దవ్వున నిప్పు డున్నయది తా మన కుండఁగఁ గాణయాచియే
యివ్విధ మేను ము న్నెఱిఁగి యెంతయుఁ జెప్ప ననాదరంబుతో
నవ్వితి గాని పట్టదు మనంబున మీఁదటిహాని ధీనిధీ. 461

వ. అని పరిదేవనంబు చేసిన తనప్రాణవల్లభ నూఱార్చి దానివిభుం డగు పక్షి యిట్లనియె.

చ. వెఱవకు కాంత నన్ను నవివేకి యితం డని నీవు చూడ కే
త్తెఱి భువనప్రపంచమునఁ ద్రిమ్మరుపక్షులఁ గూర్చి నీవు ని
వ్వెఱపడఁ బక్షివల్లభుని విష్ణునిఁ దెచ్చి యపత్య మిప్పుడే
నెఱయఁగఁ దెచ్చి యిచ్చెద ననింద్యచరిత్ర విచార మేటికిన్. 463

వ. అని యాటిట్టిభ మప్పు డేఁగి తనకార్యం బుర్విపైఁ గల్గుప
క్షినికాయంబున కేర్పడం దెలిపి భక్తిం బక్షులుం దానుఁ బు
ణ్యునిఁ బక్షీంద్రుని వేఁడుకో నతఁడు నన్నున్ మీర లెల్లం దలం
చి నమస్కారము లాచరించినను మచ్చిత్తంబు రంజిల్లుటన్. 464

మత్తకోకిల. మీర లున్నెడ కేఁగుదెంచితి మేలు మీకొకఁ డ్ద్రోయేన్
గోరి చేసెద నందు దొడ్డను గొంచెముం దలపోయకుం
డేరి కిందు నసాధ్య మైనది యిత్తు నుత్తములార నా
వార లెవ్వరు మీరు గా కని వైనతేయుఁడు పల్కినన్. 465

గీ. పక్షు లెల్ల విహంగమపతికి మ్రొక్కి, జలధి టిట్టిభములకును జలముతోడిఁ
గీడు చేసినపని యెఱిఁగింప నెఱిఁగి, యమ్మహాత్ముండు పక్షుల కభయ మొసఁగి.

వ. క్షీరాబ్ధిమధ్యగతం బగు వైకుంఠంబునకుం జని తన్మధ్యంబున దివ్యసుధాభవనం
బునఁ బన్నగతల్పంబున నున్న పురాణపురుషుం బుండరీకాక్షుం గని సాష్టాంగ
నమస్కారపూర్వకంబుగా బహువిధస్తోత్రంబుల బ్రసన్నుం జేసి తనకులస్వాము
లకుం జేసినయర్ణవదుర్ణయంబు విన్నవించిన. 467

సీ. నీలాంబుదచ్ఛాయ నెఱసినమేనితో, రమణీయపీతాంబరంబుతోడ
శంఖచక్రాదికోజ్జ్వలహస్తములతోడ, ధవళాబ్జతులితనేత్రములతోడ
వనమాలికాంకితవక్షస్స్థలంబుతోఁ, బ్రవిమలకౌస్తుభప్రబలతోడ
శోభితోభయపార్శ్వసురసమూహంబుతో, సిద్ధవిద్యాధరశ్రేణితోడ

గీ. గరుడవాహనారూఢుఁడై కైటభారి, రయముతో వచ్చి యుదధితీరమున నిల్చి
యండజంబులు మ్రొక్కిన నభయ మొసఁగి, జలధరధ్వనిఁ గేకలెత్తి జలధిఁ బిలిచె.

చ. పిలిచిన నంబుధీశ్వరుఁడు పెంపెసలార ముకుందు మందరా
చలధరుఁ గాంచి సద్వినయసంభ్రమ మొప్పఁగఁ జాఁగి మ్రొక్కినన్
జలరుహలోచనుం డనియెఁ జయ్యన నీవు హరించినట్టిపి
ల్లలఁ గొని రమ్ము పక్షులవిలాపము మాన్పుము నేఁడు మాకుఁగన్. 469

క. అనినన్ జలధి ప్రసాదం, బని వేగమ తెచ్చి టిట్టిభాండంబుల న
వ్వనజోదరుముందట నుం, చినఁ గైకొని యతని ననిచి శ్రీపతి పేర్మిన్. 470

వ. అయ్యండంబు లయ్యండజంబుల కిచ్చి యంతర్హితుం డయ్యెఁ డిట్టిభంబులు పూర్వ
ప్రకారంబున నచ్చోట సుఖంబున నుండె నని చెప్పిన సంజీవకుండు మృగేంద్రుండే
భావంబున యుద్ధసన్నద్ధుం డగు ననిన దమనకుం డిట్లనియె. 471

క. మునుగాళ్లు రెండు తోఁకయు, ఘనములుగా మీఁది కెత్తి కడు వివృతముగా
నొనరించినవదనముఁ గని, మనమునఁ దలపోయుము కలహమతిఁగా నతనిన్. 472

వ. అని చెప్పి దమనకుండు కరటకుం డున్నయెడకుం జని మన ముద్యోగించిన కార్యంబు
సఫలం బయ్యె నన్యోన్యభేదంబులు పుట్టె నని చెప్పి యతనితో మఱియు నిట్లనియె.

గీ. నయవిశారదు లైనమానవులచేతఁ, దెవుల భేదింప రానికార్యములు గలవె
గాన నేనును నావేర్పు కరము నెఱపి, కార్య మీడేర్చుకొంటిని గడఁది ననుచు.

వ. అని పింగళకునిసమ్ముఖంబునకుం బోయి పగతుండు వీఁడె యుద్ధసన్నద్ధుండై చనుదెంచుచున్నవాఁడు నీ విప్పుడు మయిమఱచి యుండం దగునె యనిన నతండును దమనకుండు చెప్పినతెఱంగునఁ గట్టాయితంబై యెదురు చూచుచుండె నంతట సంజీవకుండును జనుదెంచి మున్ను దనవిన్నచందంబున నున్నపింగళకునివికృతాకారంబు చూచి వెఱవ కతనిం దాఁకిన బింగళకుండును సంజీవకునిమీఁదికి లంఘించె నయ్యిరువురకు నన్యోన్యబద్ధామర్షయుద్ధం బుద్ధురగతిం జెల్లుచున్న సమయంబునం గరటకుండు దమనకున కిట్లనియె భవద్దుర్మంత్రవిలసితం బిట్లుండునే యని పలికి మఱియును. 375

గీ. తగిలి సామభేదదానదండములందు, మూఢుఁ డైన సామమునఁ గరంగు
భేదదానదండవాదంబు లెన్నిక, కొఱఁడు గాని సామగుణము మేలు. 476

గీ. మొదలఁ గార్యజ్ఞుఁ డగువాఁడు మూఢునందుఁ, జెలఁగి సామప్రయోగంబు సేయవలయు
సామమున నెల్లపనులును సరవిఁ బొందు, నెన్ని చూచినఁ గీడు లే దెట్టియెడల. 477

గీ. తలఁప సామభేదదానదండంబులు, భూరికార్యసిద్ధికారణములు
సంఖ్యకొఱవ నయ్యె సరవిఁ దక్కినయవి, సామముననె సిద్ధి సంభవించు. 478

చ. నరనుత చంద్రనూత్నకిరణంబులచేత సరోజబాంధవ
స్థిరమహితాతపస్ఫురణచేత, గృపీటసముద్భవప్రభా
పరిణతిచేతఁ బాయనియపారవిరోధిమహాంధకారముల్
విరియు ముహూర్తమాత్రమున విశ్రుతసామవిలాససంపదన్. 479

గీ. దగిలి సామభేదదానదండములచే, వెలయుఁ నీతి నాల్గువిధము లగుచు
నందులోన దండ మధికపాపముఁ జేయు, నది పరిత్యజించు టగ్రవిధము. 480

వ. కావున మంత్రరహితుం డగుట గర్వం బనంబడు గర్వంబున నాత్మవినాశం బగు స్వామికిం గొఱగామి సంభవించినయప్పుడు తత్ప్రతీకారం బూహించుట కర్తవ్యంబు. 481

చ. కొలఁది యెఱింగి సంధి యొడఁగూర్పఁగ నేర్చినమంత్రిమంత్రముల్
దొలఁగఁగ సన్నిపాతగతి తోడనె మాన్పినవైద్యువైద్యముల్
జెలఁగి సభాంతరాళములఁ జెప్పికొనం దగుఁ గాక యుల్లస
ద్బలుఁ డగువేళ నేయతఁడు పండితవృత్తి వహింపకుండెడున్. 482

క. నృపుఁడు గుణి యైన సచివుఁడు, కపటాత్ముం డైనఁ బ్రజలు గదియరు వానిం
జపలమకరాశ్రయం బగు, విపులసరోవరముఁ జేర వెఱచినభంగిన్. 483

వ. అని మఱియును. 484

ఉ. ఆసల నీశుభంబునకు నక్కట యీవిభు నొంటివానిఁగాఁ
జేసితి గాని సేవకులఁ జేరఁగ నీవు ప్రజాసమృద్ధి ను
ద్భాసితుఁ జేయ కంతయును దా నయి యున్నయమాత్యుఁ డెంతవి
శ్వాసము గల్గెనేని నరవర్యునకున్ బగవాఁడు దా నగున్. 485

క. పరుసనివానికి మదిహిత, మరుదుగ నొనరించు నెవ్వఁ డతఁ డమృత మగున్
బురుషవరేణ్యున కెవ్వఁడు, వెరవిడిమై కీడు సేయు విష మగు నతఁడున్. 486

వ. కావునఁ బురుషుల కహితం బాచరించు తలంపునఁ బ్రవర్తిల్లునీవు బుద్ధిహీనుండ వని
పలికి కరటకుండు మఱియు నిట్లనియె. 487

సీ. కడఁగి మనోవాక్ప్రకారంబు లేకంబు, గాక మిత్త్రునిఁ గూడి కడఁగునతఁడుఁ
బ్రతిదినప్రఖ్యాతపాపవర్తనమునఁ, దగిలి ధర్మము చేయఁ దలఁచునతఁడు
నేపార నెపుడుఁ బరాపకార మొనర్చి, పృథుసంపదలఁ గూడఁబెట్టునతఁడు
సమధికం బగుదేహసౌఖ్య మపేక్షించి, చెలఁగి విద్యల నభ్యసించునతఁడుఁ

గీ. బరుసఁదనమున స్త్రీప్రౌఢుఁ బద్మముఖులఁ, బొసఁగ వలపింతు నని తలపోయునతఁడు
నెఱుక చాలనివా రని యిద్ధరిత్రి, నెఱయ నూహింతు రనిశంబు నీతివిదులు. 488

క. స్వామిప్రసాదసంపద, వేమఱు మదిఁ గోరువానివిభవం బమరున్
స్వామిప్రసాదసంపద, వేమఱు మదిఁ గోరకుండువీఱిడి చెడెడున్. 489

క. ఏరాజు తనదుభృత్యుని, కారుణ్యమువలనఁ బ్రతుకఁగాఁ జూచి మదిన్
వారక శంకితమతి యగు, నారాజువిధంబు నీచ మగు ననుదినమున్. 490

గీ. అర్థశాస్త్రంబు చదువనియట్టివాని, పుత్త్రుఁడును దంద్రిగుణములఁ బోలి పోలుచు
జగతిఁ గేతకీవృక్షసంజాతఫలము, బహుళకంటకములచేతఁ బ్రబలినట్లు. 491

వ. కావున నీకుం జెప్పఁదగినబుద్ధి యేమి యున్నది విను మని యిట్లనియె. 492

చ. నెఱయఁగ వంపరానిధరణీజము వంపఁగఁడం గనేని నే
ర్తెఱ బలుఖడ్గధార జగతీధరశృంగము వ్రేసెనేని మీఁ
దెఱుఁగక బుద్ధిహీనునకు నెంతయు బుద్ధులు చెప్పె నేని చె
చ్చెర నొకవానరంబునకుఁ జెప్పినసూచిముఖంబుచా డ్పగున్. 493

వ. అనిన విని దమనకుండు తత్కథాక్రమం బెట్టి దని యడుగఁ గరటకుం డిట్లనియె.

యిద్ధనంబు సుబుద్ధి గ్రహించెఁ గాని, దుష్టబుద్ధికిఁ బని లేదు దృష్ట మనుచు
నీవు పలికిన నది తీఱిపోవుఁ బిదప, మనకుఁ గలకాల మెల్లను మనుట గలుగు. 515

వ. అనిన విని దుష్టబుద్ధికి దజ్జనకుం డిట్లనియె. 516

చ. చెడుతరవాయి నిట్టిపని చెప్పితి గాని ధనంబుకాంతుకున్
గడపలలేదు హీనమతి గప్పినవానికి దుష్టబుద్ధి నా
నొడువఁగ నున్నని న్నిటు తనూభవుఁగాఁ గనునట్టిపాపపుం
జెడుఁ గగునాకు దుర్లభమె చెప్పెడునారకబాధ పుత్త్రికా. 517

వ. అని పలికి మఱియు నిట్లనుఁ బ్రాజ్ఞుం డుపాయంబు చింతించినపిదప నపాయం
బును దలంపవలయుఁ దొల్లి బకమూర్ఖంబునకుం గలయపత్యంబుల నొక్కముంగి
మ్రింగినచందం బగు విను మని యిట్లనియె. 518

మ. ఒకకాసారతటంబునందు నెరపై యున్నట్టివృక్షంబుపై
బకయుగ్మంబు వసింప భార్య పురుషుం బ్రార్థించి యోనాథ య
ర్భకరాజిం దినిపోవఁ గ్రిందఁ గలసర్పం బేపుమై నింక న
చ్చిక నేతెంచుఁ బ్రసూతికాలమును వచ్చెం గార్య మెట్లుండునో. 519

వ. అనిన విని బకవిభుం డమ్మహీరుహంబు డిగ్గి కొలనితీరంబున నిల్చి విచారించు సమయం
బున నయ్యెడను నొక్కకుళీరంబు చనుదెంచి యిదియేమి దుఃఖాకులుండవై
యున్నవాఁడ వనిన నబ్బకం బిట్లనియె. 520

ఉ. నాకులకాంత గర్భమయి నందనులం గనునంతలోన ద
ర్వీకర మేఁగుదెంచి తిని వేగమ పోయెడు నెల్లినేఁటిలో
నాకలకంఠి వెండియును నర్భకులం గనువేళ గాన నే
నాకులతం దలంకెద మదాత్మకు నేమియుఁ దోఁపకుండఁగన్. 521

వ. అనినం గర్కటంబు నీకుం దగినయుపాయంబు చెప్పెద విను మని యిట్లనియె.

గీ. నకులవివరంబునందుండి నాగవిభుని, యునికిదాఁకను మీనంబు నొకటినొకటి
వైచుకొనిపోవ నాముంగి వరుసఁ దినుచుఁ, బాముఁ జంపును దీని కుపాయ మిదియె.

వ. అని కుళీరంబు చెప్పినఁ గొక్కెర యవ్విధం బాచరింప నకులం బమ్మత్స్యంబులఁ
దినుచుం జనిచని కృష్ణసర్పంబును ఖండించి వృక్షం బెక్కి బకదంపతులయపత్యంబు
లను భక్షించెం గావున. 524

క. తనబ్రతుకుకొఱకు నొరునిం, గనికర మొకింత లేక కారించినయ
మ్మనుజుఁడు గనఁ దుస్నతన్నో, ధనముల నెన్నండు మూర్ఖబకముంబోలెన్.

వ. అని యిట్లు చెప్పినతండ్రిపలుకులు గైకొనక దుష్టబుద్ధి లోభాక్రాంతుఁడై బలాత్కారంబున నతని నొప్పించుకొనిపోయి నిశామధ్యంబున, దత్తరుకోటరంబున నునిచి ప్రభాతసమయంబున. 526

సీ. ఆదుష్టబుద్ధి ధర్మాధికారులఁ బిల్చి, కులము పెద్దలఁ గూర్చుకొని కడంగి
ధర్మబుద్ధియుఁ దాన తడయక చనుదేర, నావృక్షమునకు సాష్టాంగ మెఱఁగి
సత్యంబ పలుకు వృక్షమ సాక్షి వీవన్నఁ, బూని వనస్పతిలోననుండి
ధర్మబుద్ధి మొఱంగి ధనముఁ గైకొనెఁ గాని, పుచ్చుకోఁ డీదుష్టబుద్ధి యన్న

గీ. వాగ్విలాసంబు వినఁబడ్డ వార లెల్ల, నద్భుతం బంది కనుఁగొనునంతలోన
మ్రాను పలికినచోటు దా మహి నెఱిఁగి, పాటిమాలి యసత్యంబు పలికె ననుచు.

వ. ఆధర్మబుద్ధి యంతరంగంబునఁ గోపోద్దీపితుం డై. 528

గీ. కుజము వెస నెక్కి యామ్యాదికొమ్మ లరసి, తొలఁగ వీక్షింపునపు డొక తొఱ్ఱఁ గాంచి
యింగలంబును బూరియు నెసఁగఁ దెచ్చి, కోరటంబున వైచి యచ్చోటు దొలఁగ.

క. అనలజ్వాలాజాలము, తనదేహము చుట్టుముట్టఁ దల్లడపడుచున్
మునుకొని మొఱ్ఱలు వెట్టుచు, జనములపై దుష్టబుద్ధిజనకుం డుఱికెన్. 530

గీ. పడినసెట్టిఁ జూచి పైఁబడి ధర్మాధి, కారు లెల్ల బ్రమసి కదిసి యడుగ
సుతుఁడు దుష్టబుద్ధి సుండు న న్నిటువంటి, యుడుకు చేసె ననుచు నుసులు విడిచె.

వ. విడిచినం జూచి ధర్మాధికారు లత్తెఱం గంతయు మహీకాంతునకుం జెప్పిన నతండు దుష్టబుద్ధిం గొఱతవేయం బంచి వానిసర్వస్వంబునుం జూఱకొనియె నని చెప్పి కరటకుండు మఱియు నిట్లయె. 531

సీ. సమధురవాహినీసంపూర్ణజలములు, వడి లవణాబ్ధిలో నడఁగుదాఁక
ప్రకటితస్నేహసంబంధబంధుత్వంబు, లంగనానిర్భేద మయినదాఁక
నత్యంతకాంతరహస్యవాక్యంబుల, వివరించి కొండీఁడు విన్నదాఁక
కలితపారంపర్యకులసమృద్ధి దలంప, నిలఁ గుపుత్త్రుం డుదయించుదాఁక

గీ. నిలుచు ననేగాని యటుమీఁద నిలువ కునికి, దప్ప దండురు నయశాస్త్రధర్మవిదులు
నీవు కులహాని యగునట్టినీచగతికిఁ దగిననడవడి గన భయం బగుచు నుండు.

గీ. కడఁగి పిశునవృత్తిఁ బెడఁబాయ కుండిన, వాని వదలకున్న వాఁడుఁ జెడును
నురగశాబకంబుఁ జిరకాల మొగిఁ బెంప, మెఱసి యొక్కవేళఁ గఱువకున్నె.

గీ. ఎఱుకగలవానిపొం దైన నెందు నమరు, నతఁడు కపటాత్ముఁ డయ్యె నేనదియుఁ గాదు
మూర్ఖుతోఁ గూడి మెలఁగెడుమూర్ఖశతుని, సఖ్య మెన్నండుఁ గొఱ గాదు సజ్జనులకు.

వ. కావున నీవు స్వామికి నిట్టిదురవస్థ యుత్పాదించి తింక నన్యులు నీకుం దృణకణాయ
మానం బగుట నిశ్చయంబు విను మని యిట్లనియె. 536

ఉ. వేయితులాలలోహమును వేడుకతోఁ దినె మూషకంబు ల
త్యాయతశక్తి నంచు వ్యవహారి యొకం డన నెక్కరుండు పి
న్నాయన నొక్కగృధ్రము రయంబున నెత్తుకపోయె నంచు ము
న్నోయి విచిత్ర మైనకథ యొక్కటి వింటిమి నీవు వింటివే. 537

వ. అనిన నక్కథ వినవలయు నాకుం జెప్పు మనినఁ గరటకుం డిట్లనియె. 538

చ. లలి నెకపట్టణంబునఁ గలం డొకవైశ్యుఁడు లేమిచేత ని
మ్మ్రల వ్యవహారికంబునకుఁ బోవుచు లోహతులాసహస్ర మి
ట్టలముగ నెక్కచుట్టముకడం బదిలంబుగఁ బెట్టి సమ్మదం
బొలయఁగ నాత్మమందిరము నెద్దకుఁ గ్రమ్మఱ వచ్చి యత్తఱిన్. 539

వ. లోహం బిడినవైశ్యునికడకుం జని యతం డిట్లనియె. 540

క. ఇన్నిదినంబులుఁ బోయితి, నన్నా పరదేశమునకు నచ్చట నాకుం
జిన్నముఁ జిదరయుఁ బుట్టక, మిన్నక రావలసె మగిడి మీ యున్నెడకున్. 541

క. మీయింట దాఁచఁబెట్టిన, నాయినుమిపు డొసఁగవలయు నని పలికిన వాఁ
డీయక మూషకములు తిని, పోయె ననుచు ద్రవ్యలోభమున ననె నతఁడున్.

క. ఈలాగున నాసొమ్ముఁ, జాలక కేరడము లాడుచనవరి నెట్టుల్
దూలించి మోసపుచ్చక, యేలా నాసొమ్ము వచ్చు నింతట ననుచున్. 542

ఉ. ఆయెడ లోహహర్త యగునాతనిసూనుఁడు వచ్చె నాడఁగాఁ
బోయి జలంబు లాడుటకుఁ బోదము రమ్మని వానిఁ గొంచు నా
త్మాయతనంబు చేరువగృహంబున బాలుని దాఁచి యుండఁగాఁ
బాయనిదుఃఖభారమున బాలునితండ్రియు వాని రోయుచున్. 543

గీ. పురవరంబున నింటింట నరసియరసి, యడుగఁగా లోహ మిచ్చినయతఁడె కొడుకు
నంత గొనిపోయె నని చెప్ప నతఁడు వించు, శీఘ్రగతితోడఁ జనుదెంచి సెట్టితోడ.

క. పాపని నదికిం దోడుక, వే పోయితి వాఁడు రాఁడు వెండియు సతి దా
వాపోవఁ దోడఁగెఁ జెప్పవు, పాపం బని తలఁచి దుఃఖపడ వింతైనన్. 544

వ అనిన నతం డిట్లనియె. 545

క. ఇద్దఱమును నేటికిఁ జని, ప్రొద్దున్నఁ దీర్థంబులాడి బోరన రాఁగా
గ్రద్దెత్తుక చనె నీసుతు, బద్ధరవలె నుండు ననుచుఁ బలుకఁగ వెఱతున్. 546

వ. అనిన నతండు రూక్షేక్షణుండై యతిత్వరితగతిం బఱచి రాజద్వారంబున నాక్రోశింప నమ్మహీశ్వరుండు ధర్మాధికారులం బిలువం బంచి విచారింపుం డన వారును నవ్వైశ్యునిఁ దన్నిమిత్తం బడిగిన నతం డిట్లనియె. 547

గీ. సెట్టి దొంగ యొకఁడు శీఘ్రము నాపట్టిఁ
బట్టి చంపి పక్షి పట్టుకొనుచుఁ
బాఱిపోయె ననియె భావింపరయ్య యీ
యాగడంబు భూమియందుఁ గలదె. 548

వ. అనిన విని ధర్మాధికారు లీకార్యం బతర్కితం బిది విచారింపం దగు నని ప్రతివాది వైశ్యునిం బిలువం బంచి యవ్విధం బడిగిన నతం డిట్లనియె. 549

క. వేయితులాలం గలిగిన
యాయినుమితనింట నిడిన నది యెలుకలచేఁ
బోయె ననెఁ జిన్నపాపని
నాయతగతి గ్రద్దకొనుచు నరుగుట యరుదే. 550

చ. అని పలుకంగ నాసభికు లప్పు డెఱింగి యితండు సెట్టి నీ
యినుమొసఁగుం గుమారకుని నిమ్మని వారలు చక్కఁబెట్టినన్
మనమున సమ్మతించి మఱుమాటన కాసభవారు తీర్చి చె
ప్పినగతి నట్ల చేసి రని పెంపెసఁగన్ గథ చెప్పి యిట్లనున్. 551

క. మతిమంతుఁడైనవానికి
హితముగ నొకమాట చెప్ప నెఱిఁగి చరించున్
ధృతి దఱుఁగ నీవు నేలా
ప్రతిమగతిం జేష్ట దక్కి భ్రమసితి గంటే. 552

వ. కావున నీకు నేకార్యంబును నుపదేశింపం బనిలేదు నిన్నుఁ గూడుట యనుచితంబు.

గీ. సుజనదుర్జనసంగతిఁ బ్రజలు నడువ
గుణములును దుర్గుణంబులుఁ గూడి పరఁగు
వరుస బహుదేశసంచారవాయువులకు
గంధదుర్గంధములు వచ్చి కలసినట్లు. 553

క. మతిమంతులు దమకార్య
స్థితు లొనరింపంగఁ జింత సేయుదు రభ్యా
గతజల మానెడుమనుజుం
డతితృష్ణాభరముఁ దొరయ నరయనిభంగిన్. 555

వ. అని యిట్లు కరటకుండు పలుక దమనకుం డిట్లనియె మనస్వామి సంజీవకునిం జంపిన తెఱం గెఱుంగవలయుఁ బోద మని యయ్యిరువురుఁ గదియం జనునప్పుడు పింగళకుం డటమున్న సంజీవకుం దెగటార్చి పశ్చాత్తాపంబునం బొరలుచుండి యప్పుడు దమనకుం జూచి చూచితే యని పలికి యిట్లనియె. 556

శా. పాలింపం దగువానిఁగాఁ దలఁచి తాఁ బాలించి రాజార్హాసు
శ్రీలం బ్రోదిగఁ జేసి పెంచుటయ ధాత్రీపాలధర్మంబు గా
కేలా యిట్లు విచారదూరమతి నై యేఁ ద్రుంచితిన్ వాని దు
శ్శీలుండై విషవృక్ష మైన నిడి తా ఛేదించునే యెవ్వఁడున్. 557

వ. అదియునుంగాక. 558

చ. అవగుణి యైనఁ గాక సుగుణాత్మకుఁ డైన భటోత్తము న్మహీ
ధవుఁడు పరిత్యజింప మఱి తక్కినవారు తొలంగిపోదు ర
య్యవినయవృత్తి భూపతికి హానియు ధాత్రికి నాకులంబు నై
భువి నపకీర్తి పుట్టుఁ దలపోసి తలంకెద నేమిసేయుదున్. 559

వ. అనిన విని దమనకుండు దేవా వైరిసంహరణానంతరంబున నిట్లు సంతాపింపం బని లేదు విను మని యిట్లనియె. 560

ఉ. సమ్మద మొప్ప వైరిజనసంహరణం బొనరించెనేని శో
కమ్మను బొంద నేల ఘనగర్వమునన్ బ్రతికూలవృత్తిగాఁ
దమ్ములు భృత్యులున్ హితవితానముఁ బుత్త్రులుఁ గూడ నుండినన్
గ్రమ్మఱ నాజ్ఞ సేయఁ దగుఁ గాదె నృపాలుర కివ్వసుంధరన్. 561

సీ. సార్వకాలికకృపాసంపూర్ణమతి యైన, మానవేశ్వరునకుఁ గానిగుణము
కుటిలవిచారసంఘటితమిత్త్రుం డైన, వాని భావించినఁ గానిగుణము
సమధికప్రియమున సర్వభక్షకుఁ డైన, భూనిలింపున కది కానిగుణము

